శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమద్వరవరమునయే నమః



## దొడ్డయాచార్యస్వామివారు అనుగ్రహించిన,

## కంచి గరుడోత్సవ వైభవాన్ని ప్రకాశింపజేసే

# దేవాధిరాజపంచకం

# సవ్యాఖ్యానమ్






'పండిత రత్న' డా॥ ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి అ॥గ శింగరాచార్యులు

**సంపాదకుడు:** ఈయుణ్ణి అనంత రంగ రామన్


09-03-2022

# విషయసూచిక

# కంచి గరుడోత్సవ వైభవం

**(ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి అప్పళ్ళగ శింగరాచార్యస్వామి విరచితం)**

**1) ముక్తాశ్వేతాపత్రద్వయ రుచిరుచిరం చామర ద్వంద్వ సేవ్యం**
**పక్షీంద్రస్కంధసుస్థం కరతలయుగళే న్యస్తపాదం చ తస్య,**
**సర్వా నానందయంతం స్ఫురదురునిజసందర్శనాచ్చ ప్రతోళ్యాం**
**ప్రాతః సంభావ్య మోదే మమ హృది వరదం వైనతేయోత్సవేద్ధమ్.**

(ముత్యాలు పొదిగిన తెల్లని రెండు గొడుగుల కాంతులతో అందమైనవాడు, రెండు చామరాలతో సేవింపబడేవాడు, గరుడునిపై అందంగా వేంచేసి ఉన్నవాడు, ఆ గరుడుని రెండు చేతులలో తన శ్రీచరణాలను రెండిటినీ పెట్టినవాడు, ఉదయకాలంలో వీధిలో ఉండే అందరినీ ప్రకాశించే తన దర్శనంతో ఆనందింపజేసేవాడు, గరుడవాహనోత్సవంలో గొప్పగా ప్రకాశించేవాడు అయిన వరదరాజస్వామిని ప్రాతఃకాలంలో నా మనస్సులో భావించి, ఆనందిస్తున్నాను)

**2) కశ్చిత్ నీలాంబువాహః కనకమయగిరేః శృంగ మారోహతీవ**
**స్వర్ణాలంకారమధ్యే స్థగిత ఇవ మహానీలఖండః ప్రదీప్తః,**
**కాంచ్యాం దేవాధిరాజో నిజతనురుచినా దీపయన్ సర్వకాష్ఠాః**
**ప్రత్యగ్ద్వారే ప్రగేఽయం గరుడభుజయుగస్కంధదృశ్యోఽభియాతి.**

(మేరు పర్వత శిఖరాన్ని ఒక నల్లని మేఘం అధిరోహించినట్లు, బంగారంతోచేయబడిన ఆభరణం మధ్యలో ఒక గొప్పగా ప్రకాశించే నీలమణిని

పొదిగినట్లు ఉండే రీతిలో గరుడవహనంపై వేంచసిఉండే వరదరాజస్వామి, కాంచీపురం వీధులలో తన దివ్యమంగళవిగ్రహ ప్రకాశంతో అన్నిదిక్కులనూ ప్రకాశింపజేస్తూ ఉదయకాలంలో ఉత్తరగోపురద్వారంలో ప్రకాశిస్తున్నాడు)

**3) సర్వే పశ్యంతు సమ్యక్, సకలనిగమసంప్రోక్తతత్త్వేషు వేద్యం**
**పాదద్వంద్వం మురారేః, తదిహ దిశతి నో దర్శనం నేత్రపర్వమ్,**
**సేవధ్వం తత్, శ్రయధ్వం సముచితవిధయా తస్య సేవాం కురుధ్వం,**
**సాఫల్యం జన్మనో వో భవతి నను తదేత్యాహ నః తార్ క్ష్యవాహః.**

(అందరూ బాగా చూడండి!. అన్ని వేదాలలో చక్కగ చెప్పబడిన తత్వం ఈ వరదరాజస్వామి శ్రీచరణాలే!. అవి ఇప్పుడు మనకు కన్నులపండుగగా దర్శనం ఇస్తున్నాయి. వాటిని సేవించండి. ఆశ్రయించండి. తగిన రీతిలో వాటికి కైంకర్యం చేయండి. ఈ జన్మకు తగిన ఫలాన్ని పొందండి – అని గరుడభగవానుడు మనకు ఉపదేశిస్తున్నాడు)

**4) యద్వేదే, తచ్ఛిరస్సు, స్మృతివితతిపురాణేతిహాసాదికేషు**
**ప్రోక్తం, శ్రీమచ్ఛఠారిప్రముఖమునివరైః ద్రావిడే సంప్రదత్తమ్,**
**నాథశ్రీయామునశ్రీయతివరవరమున్యాదిపూర్వార్యభీష్టం**
**తల్లక్ష్మీశాఖ్యతత్త్వం శ్రుతిమయగరుడే ప్రేక్ష్యతా మత్ర భవ్యమ్.**

(వేదాలలో, వేదాంతాలలో, అనేక స్మృతులలో, పురాణాలలో, ఇతిహాసాలు మొదలైనవానిలో తెలుపబడినది, నమ్మాళ్వార్లు మొదలైన దివ్యసూరులచే దివ్యప్రబంధాలలో చక్కగా అనుగ్రహింపబడినది, నాథమునులు, యామునులు,

భగవద్రామానుజులు, శ్రీవరవరమునులు మొదలైన పూర్వాచార్యులకు అభిమతమైనది అయిన లక్ష్మీనారాయణ తత్త్వాన్ని వేదస్వరూపుడైన గరుడునిపై దర్శించండి)



**కంచి గరుడసేవ**

**5) ముక్తా ఛ్చత్రద్వయోప్తాః సితశుచిరుచిరాః శుద్ధసత్త్వస్య సూచ్యో**
**జీవేనేశః స్సదైవోచితతమవిధయా సేవ్య ఇత్యర్థ మాహుః,**
**శేషిత్వం శ్రీపతేః తత్సకలనియమనే శక్తతా చాప్యతా సం**
**సూచ్యంతే వ్యంగ్యరీత్యా వరదవిభుగరుత్మన్మహే నిత్యభావ్యే.**

(రెండు తెల్లని గొడుగులలో పొదగబడిన, తెల్లని కాంతులతో మెరిసే, స్వచ్ఛమైన, అందమైన ముత్యాలు శుద్ధసత్త్వ గుణాన్ని సూచిస్తున్నాయి. అవి, జీవుడు భగవంతునకు ఎల్లప్పుడూ తగిన రీతిలో సేవచేయాలి – అనే తత్త్వాన్ని తెలుపుతున్నాయి. నిత్యం భావించదగిన వరదరాజస్వామి, గరుడవాహనం ద్వారా భగవంతుని శేషిత్వం, అతడు సకల జీవులను నియమిస్తాడనే విషయం, అతడు పొందదగినవాడు అనే విషయం సూచింపబడుతున్నాయి)

**6) బ్రహ్మా వా శంకరో వా గణపతి రథవేంద్రనామా చ కశ్చిత్**

**శ్రీమాన్నారాయణో వా విలసతి పరమో వేదశీర్షేషు వేద్యః,**

**ఇత్యాకారాం తు శంకాం జనహృదయ చామరౌ చాలనైః స్వైః**

**ధూన్వంతా వాహతు ర్నో పర ఇహ వరదోఽస్తీతి తత్త్వం రహస్యమ్.**

(వేదాంతాలలో తెలియదగిన తత్త్వం బ్రహ్మయా?, లేక శివుడా?, లేక గణపతియా?, లేక ఇంద్రుడా?, లేక శ్రీమన్నారాయణుడా? – అని ప్రజల మనస్సులలో ఉండే సందేహాన్ని చామరాలు రెండూ తమ కదలికలతో చెదరగొడుతూ, పరతత్త్వం వరదరాజస్వామియే అనే రహస్యాన్ని ప్రకటిస్తున్నాయి)

**7) మాయాఖ్యా యా తు శక్తి హరికరగతా తస్య లీలోపకర్త్రీ**

**రుంధంతీ తత్త్వబుద్ధిం జనయతి చ భవే ప్రాప్యబుద్ధిం సదైవ,**

**సైషా శక్యాఽపనేతుం యది వరదపదాబ్జౌ శరణ్యౌ భజేయుః**

**ద్రాగిత్యేనం సదర్థం ప్రదిశత ఇహ న శ్చామరౌ చాలవైః స్వైః.**

('మాయ' అనే పేరుగలిగిన శక్తి భగవంతుని చేతిలో సాధనం. అది అతని లీలకు ఉపయోగపడుతున్నది. అది తత్వజ్ఞానాన్ని అడ్డుకుంటున్నది. సంసారం పట్ల 'అది అనుభవించదగినది' అనే బుద్ధిని ఎల్లప్పుడూ కలిగిస్తున్నది. ఈ మాయను వరదరాజస్వామి పాదాలను ఆశ్రయించదగిన శ్రీచరణాలను ఆశ్రయిస్తే, వెంటనే పోగొట్టుకోవచ్చు – అనే గొప్ప అర్థాన్ని రెండు చామరాలూ తమ కదలికలతో తెలుపుతున్నాయి)

**8) కాంచ్యాం వేదమయం సుపర్ణమధిరుహ్యేశే ఉభియాతే చ, తత్**

**పార్శ్వే చామరయుగ్మసంచలనతః సవ్యాపసవ్యాత్మకాత్**

**నాశోఽత్ర ద్వివిధాత్మనోః సదసతోః సంసూచ్యతే కర్మణోః,**

**సేవాదర్శనతః సర్వజనిమజ్జీవాత్మనాం శ్రీపతేః.**

(వేదమయుడైన గరుడుని అధిరోహించి కాంచీ నగరంలో వరదరాజస్వామి వేంచేసినపుడు ఆ వాహనానికి రెండువైపులా కుడి–ఎడమలలో కదలాడే రెండు చామరాల కదలికల వల్ల, జీవుడు చేసిన రెండువిధాలైన కర్మలు, సకలజీవులు చేసిన రెండు విధాలైన పుణ్య–పాప రూపాలైన కర్మలు గరుడోత్సవాన్ని సేవించడం వల్ల నశిస్తాయని సూచింపబడుతున్నది)



# విన్నపం

**1) కాంచ్యాం వైశాఖమాసే వరవరదవిభోః వైనతేయోత్సవే యత్**

**భక్తస్వాంతేష్వతృప్తామృత మివ సతతం భాసతే వైభవం తత్,**

**సుశ్లోకైః పంచసంఖ్యాపరిమితరుచిరార్థైః మహాచార్యవర్యః**

**తుష్టావ ప్రాజ్యభక్త్యా, ప్రతిదిన మనుసంధీయతేఽస్మాభిరేతత్.**

**2) శ్రీదేవరాజపంచక వినుతిం విశదీకరోతి వాచాంఽధ్ర్యా,**

**శ్రీదేవరాజపదనత తృప్త్యై దాసో నృసింహనామాఽయమ్.**

మన పూర్వాచార్యులు అనుగ్రహించిన స్తోత్రాలు అన్నీ సంప్రదాయర్థాలను మధురంగా ప్రకాశింప చేస్తున్నాయి. అటు అటువంటి, నిత్యం భావించదగిన స్తోత్రాలలో శ్రీ దేవరాజ పంచకం అనే ఈ స్తోత్రం ఒకటి. దీనిని చోళసింహపురవాసి అయిన మహాచార్యులు అనే దొడ్డయాచార్యులవారు రచించారు. వైశాఖ మాసంలో మహావైభవంగా, భక్తులకు కన్నులపండుగగా జరిగే ప్రసిద్ధమైన వరదరాజస్వామి గరుడసేవ లోని వైభవాన్ని, ఇందులో వారు మనకు కళ్ళకు కట్టినట్లు అందించారు. ఈ శ్లోకాలనుమనం మనసులో భావించినపుడు కంచిలో జరిగే వరదరాజ స్వామి గరుడ సేవ దృశ్యం మన కంటి ముందు సాక్షాత్కరిస్తుంది – అని అనడంలో ఏ సందేహం లేదు. ఈ విధంగా వర్ణించడం కవికి కల భావనాపటిమను, వర్ణనా చాతుర్యాన్ని తెలుపుతున్నది.



భగవంతుని రూపాలలో అర్చావతారం ఒకటి. ఇది అందరికీ అనుభావ్యమైనది. అటువంటి అర్చావతారాలలో ఒకటి అయిన వరదరాజస్వామికి జరిగే గరుడోత్సవంలోని వైభవాన్ని వర్ణించే ఈ స్తోత్రం భగవద్గుణవైభవంలో పర్యవసిస్తుంది కనుక, ఇది నారాయణపదార్థాన్ని తెలియజేస్తున్నదని భావించడంలో ఏ ఆటంకం లేదు. ఈ స్తుతి యొక్క అర్థతాత్పర్యాలు సంగ్రహంగా **కాంచీ మహావిద్వాన్ ఉ.వే.శ్రీమాన్ ప్ర.భ.అణ్ణంగరాచార్య స్వామివారు** తమిళంలో అనుగ్రహించిన టీకను ఆధారంగా చేసికొని, మరిన్ని వివరాలు **ఉ.వే.శ్రీమాన్ ఒప్పిలియప్పన్ వరదాచారి శడగోపన్ స్వామి వారు** ఆంగ్లంలో అందించిన వివరణను ఆధారంగా చేసికొని వివరాలు అందింప–బడుతున్నవి. అణ్ణంగరాచార్య స్వామివారి తమిళ గ్రంథాన్ని నాకు అందించిన **ఉ.వే.శ్రీమాన్ అమృతపురి శ్రీకృష్ణ రామానుజం అయ్యంగార్ స్వామివారికి** కృతజ్ఞతా–పూర్వక మంగళాశాసనములు. రాబోయే 'శుభకృత్' నామ సంవత్సరం దొడ్డయాచార్య

స్వామి వారి అవతార సంవత్సరం అయినందున, ఇది సందర్భోచితం అని తలుస్తూ, వారు అనుగ్రహించిన దేవాధిరాజ పంచక స్తోత్రానికి తెలుగులో వ్యాఖ్యానం వారి కైంకర్య రూపంగా ప్రపన్నుల సన్నిధిలో సమర్పింపబడుతున్నది. ఈ గ్రంథాన్ని సిద్ధం చేయడంలో నాకు సహకరించిన చి. శ్రీమాన్ అనంత రంగ రామన్ కు మంగళాశాసనాలు. స్వస్తి.

**భాగవత విధేయుడు**

**శింగరాచార్యులు**

# దొడ్డయాచార్యస్వామి వారి వైభవము

మహాచార్యులని, దొడ్డయాచార్యులని వ్యవహరింపబడే ఈ ఆచార్యవర్యులు, చోళసింహపురనివాసి. దొడ్డ అంటే పెద్ద అని అర్థం. వీరు, 'శ్రీనివాస మాహాచార్యులు' అనే పేరుతో ప్రసిద్ధులు. ఈ దివ్యదేశం, సంప్రదాయంలో "తిరుక్కడిగై" అని పిలువబడుతున్నది. తిరుత్తణికి సుమారు 20 కి.మీ. దూరంలో ఉండే ఈ క్షేత్రంలో, రెండు కొండలున్నాయి. పెద్ద కొండపై యోగనరసింహస్వామి, చిన్న కొండపై యోగాంజనేయస్వామి వేంచేసి ఉన్నారు.

దొడ్డయాచార్యస్వామి క్రీ. శ.10– ఫిబ్రవరి–1543 నుండీ 01– అక్టోబరు–1591 మధ్యకాలంలో వేంచేసి ఉన్నట్లు తెలుస్తున్నది. వీరు, శుభకృత్ సంవత్సరంలో, మాసి మాసం, కృష్ణపక్షం, త్రయోదశి తిథి, ఉత్తరాషాఢా నక్షత్రంలో, గురువారం నాడు శ్రీవేంకటేశ్వరుని అంశతో అవతరించారు. అందువల్లనే వీరికి మహాచార్యులని పేరు వచ్చింది.

మణవాళమహామునుల కాలంలో వారి శిష్యులలో ప్రధానులు 'పొన్నడిక్కాల్ జీయర్'. వీరే మొదటి వానమామలై జీయర్. 'ప్రతివాదిభయంకరం అణ్ణా' బంధువులైన 'అప్పచ్చియారణ్ణా', 'పొన్నడిక్కాల్ జీయర్'ను మణవాళమామునుల ఆజ్ఞానుసారం ఆశ్రయించారు. దీనిని గమనించిన అప్పాచియారణ్ణా సొదరులు అయిన 'దొడ్డప్పయ్యంగార్' కూడా పొన్నడిక్కాల్ జీయర్ ను ఆశ్రయించారు.

ఈ దొడ్డప్పయ్యంగార్, తరువాత ఘటికాచలం దగ్గరలోని ఎరుంబి గ్రామానికి చేరారు. అప్పటికి ఇంకా చోళసింహపురం గ్రామం ఏర్పడలేదు. దొడ్డప్పయ్యంగార్ ముదలియాండాన్ వంశస్థులు. అందువల్ల వీరు కందాళ వంశీయులు.

ఈ ముదలియాండాన్ వంశానికి చెందిన 'దైవంగాళ్ పెరుమాళ్ తోళ్లప్పర్', మరియు వారి కుమారులు 'పోరేఱ్ఱు నాయన్' చోళసింహపురంలో స్థిరపడి, అక్కడ రామానుజ సంప్రదాయాన్ని వ్యాప్తి చేసేవారు. ఈ వాధూల కులంలో ఉద్భవించిన పెరియప్పన్, శిరియప్పన్ అనే ఇద్దరు సోదరులు ముదలియాండాన్ వంశంలో 11వ పట్టాన్ని అలంకరించారు. ఈ పెరియప్పన్ స్వామి కుమారులే దొడ్డయాచార్య స్వామి. వీరు 12వ పట్టాన్ని అలంకరించారు. పెరియప్పన్ స్వామివారి వద్ద అన్ని శాస్త్రాలను చోళసింహపురంలో అభ్యసించడమే కాక, తిరుమల కూడా పలువురు విద్వాంసుల వద్ద శాస్త్రాధ్యయనాన్ని చేశారు. వాధూల వంశానికి చెందిన పలువురు ఆచార్యులు తిరుమలతో అవినాభావ సంబంధాన్ని కలిగిన వారు.

శ్రీరామానుజులు దొడ్డయాచార్యస్వామి వైభవాన్ని ప్రకాశింపజేయదలచారు. పెరియప్పన్ స్వామి శిష్యులలో ఒకరైన అయప్పయ్యంగార్, ఒకరోజు పెరియప్పన్ దగ్గరకు వచ్చి, తమకు గతదినం కలలో కలిగిన అనుభవాన్ని గూర్చి తెలియజేశారు. ఆ కల ఈ విధంగా ఉన్నది:

*"ఒకవ్యక్తి సన్యాసి వేషంలో పెరియప్పన్ స్వామి దగ్గరకు వచ్చారు. ఆ సమయంలో పెరియప్పన్ స్వామి కాలక్షేపాన్ని అనుగ్రహిస్తున్నారు. వచ్చిన వ్యక్తి ఒక పెద్ద నల్లని గ్రంథాన్ని ఇచ్చి, దానిని తన కుమారులైన దొడ్డయాచార్యస్వామి వారికి అందజేయమని తెలుపుతూ దొడ్డయచార్యస్వామి తనియన్ ను ఈ విధంగా పలికారు:*

*వాధూలశ్రీనివాసార్యతనయం వినయోజ్జ్వలమ్,*

*ప్రజ్ఞానిధిం ప్రపద్యేఽహం శ్రీనివాసమహాగురుమ్.*

*(వాధూలకులంలో అవతరించిన శ్రీనివాసాచార్యుల పుత్రులు, వినయగుణంతో గొప్పగా ప్రకాశించేవారు, కులానికి నిధివంటివారైన శ్రీనివాసమహాగురువును శరణుపొందుతున్నాను)"*

ఈ సంగతిని తెలియగానే పెరియప్పన్ స్వామి చాలా సంతోషపడి, సాక్షత్తూ రామానుజులే దొడ్డయాచార్య స్వామిని అనుగ్రహించారని భావించారు.

## కంచి వరదరాజస్వామి అనుగ్రహం:

ఒకానొక సమయంలో శ్రీరంగం నుండి అఙ్గగియ మణవాళ జీయర్ స్వామి వేంచేసి, కంచి వరదరజ స్వామికి పలు ఆభరణాలను సమర్పింపదలచారు. ఈ సందర్భంలో జీయర్ స్వామి, పెరియప్పన్, శిరియప్పన్ స్వాములను కంచికి రమ్మని ఆహ్వానించి వారి మంగళాశాసనాలను తాము సమర్పించే నూతన ఆభరణాలకు అందజేయవలసినదిగా కోరారు. కాని వారిద్దరూ వేరొక సమయంలో తాము రాగలమని, అపుడు రాలేమని అన్నారు. అపుడు దొడ్డయాచార్యస్వామివారికి స్వప్నంలో ఈ విధంగా గోచరించింది:

*ఒక రాజు గుర్రంపై వచ్చి, దొడ్డయాచార్య స్వామివారిని, విశ్రాంతి తీసుకుంటున్న పెరియప్పన్, శిరియప్పన్ స్వాములను నిద్రలేపమని, వారిని తమను కలవమని అన్నాడు. కానీ అందుకు దొడ్డయాచార్యస్వామి వారు అంగీకరించలేదు. అపుడు ఆ రాజు చాలా శ్లోకాలను పలుకుతూ తన వివరాలను తెలియజేశాదు.*

*అయినా ఫలితం లేకపోయింది. అపుడు ఆ రాజు, దొడ్డయాచార్యస్వామి వారి భుజంపై ఒక చరుపు చరిచి, 'ఆ స్వాములు ఇద్దరూ వైశాఖోత్సవానికి వచ్చి నన్ను దర్శించుకోలేరా? వెంటనే వచ్చి నన్ను కంచిలో దర్శించమని చెప్పండి' – అని పలికి అదృశ్యమయ్యాడు.*

దొడ్డయాచార్యస్వామి, ఆ రాజు తమ భుజంపై కొట్టిన దెబ్బను గుర్తుచేసుకుంటూ నిద్రలేచి, ఈ కలలో తమకు కలిగిన అనుభవాన్ని పెరియప్పన్ స్వామికి తెలియజేశారు. అపుడు పెరియప్పన్ స్వామి, శిరియప్పన్ స్వమి, ఆ విధంగా కలలో కనిపించిన రాజు, కంచి వరదరాజ స్వామియేనని తెలిసికొన్నారు. దొడ్డయాచార్యస్వామి భుజాన్ని ప్రేమగా నిమురుతూ, 'నీవు భగవంతుని పవిత్రమైన స్పర్శను పొందావు' – అని పొగిడారు.

దొడ్డయాచార్యస్వామి కంచి వరదరాజస్వామి విషయంలో అంతులేని భక్తిప్రపత్తులను కలిగి ఉండేవారు. ప్రతీ ఏడు విధిగా కంచి గరుడసేవను సేవించుకొనేవారు. కొంతకాలానికి వృద్ధులైన దొడ్డయాచార్యస్వామివారు ఒక ఏడు వరదరాజస్వామి గరుడోత్సవాన్ని సేవించుకోలేకపోయారు. అందువల్ల మనస్సులో చాలా బాధపడి, 'దేవరాజాధి పంచకాన్ని' ఆశువుగా పలికారు. అపుడు వరదరాజస్వామి, స్వయంగా గరుడవాహనంపై ఆసీనుడై, దొడ్డయాచార్యస్వామివారికి తక్కాంగుళం (చోళసింహపురంలోని పుష్కరిణి) వద్ద సేవను అనుగ్రహించాడు.

ఈనాటికీ కంచిలో వైశాఖ మాసంలో గరుడోత్సవం నాడు ఉత్సవం ప్రారంభం అవ్వడానికి ముందు, ఆ స్వామిని గొడుగులతో ఒక క్షణం పాటు ఆవరిస్తారు. ఆ సమయంలో స్వామి చోళసింహపురంలో దొడ్డయాచార్యస్వామివారికి సేవ

అనుగ్రహిస్తున్నట్లు భావింపబడుతుంది. దీనికే 'దొడ్డయాచార్యస్వామి వారి సేవ' గా పేరు.



| | | |
|---|---|---|
| **పేరరుళాళన్ - గరుడసేవ** | **దొడ్డయాచార్యస్వామి** | **కంచి గరుడసేవలో దొడ్డయాచార్యస్వామి సేవ** |

ఆ సందర్భానికి గుర్తుగా, 'తక్కాంగుళం'గా (తక్కాన్ + కుళం = తక్కాన్ స్వామి యొక్క కోనేరు) పిలువబడే చోళసింహపురంలోని పుష్కరిణి ఒడ్డున నిర్మింపబడిన వరదరాజస్వామి కోవెలను ఇప్పటికీ దర్శించవచ్చు.

దొడ్డయాచార్య స్వామివారు 12 సంవత్సరాల పాటు తిరుపతికి దగ్గరలోని స్వర్ణముఖీ తీరంలో నివసించి, ఘటికాచలంలో తక్కాంగుళంలోని భక్తవత్సల స్వామికి ఆలయ నిర్మాణాన్ని చేయడానికి ప్రయత్నం చేశారు. తరువాత వారు చోళసింహపురాన్ని చేరారు. ఆకాలంలో తిరుమల ప్రాంతాన్ని 'అచ్యుత మహా

దేవరాయలు' పాలించేవాడు. ఆ రాజు సహాయంతో తక్కాన్ స్వామి (భక్తోచిత/ భక్తవత్సలన్ స్వామి) ఆలయాన్ని నిర్మాణం చేయాలని దొడ్డయాచార్యస్వామివారు



**షోళింగర్ శ్రీవరదరాజస్వామి సన్నిధి**





**వరదరాజస్వామి, పెరుందేవి తాయార్ - షోళింగర్ శ్రీవరదరాజస్వామి సన్నిధి**

ప్రయత్నం చేశారు. ఎరుంబి గ్రామం సమీపంలో దొడ్డయాచార్యస్వామి వారు పల్లకిలో వస్తూఉండగా, ఆ ప్రభువు గుర్రంపై వస్తున్నాడు. ఆ గ్రామం ఘటికాచలానికి 2 మైళ్ళ

దూరంలో ఉన్నది. కొంత దూరం ప్రయాణం చేసిన తరువాత, రాజుగారి గుర్రం స్మృతితప్పి కింద పడిపోయింది. ప్రభువు దానిని చాలా అపశకునంగా భావించాడు. అపుడు దొడ్డయాచార్యస్వామి ఆ గుర్రంపై పవిత్ర జలాన్ని ప్రోక్షణ చేసి ఆ గుర్రానికి స్మృతి తెప్పించి బ్రతికించారు.

అపుడు ప్రభువు చాలా సంతోషించి వారికి సహాయంచేయలని భావించాడు. ఆ ప్రభువు సహాయంతో 'ఎరుంబి' గ్రామంలో తూర్పుదిశలో తక్కాన్ ఆలయం నిర్మింపబడింది. ఆలయం చుట్టూ ఎనిమిది వీధులు ఏర్పాటు చేయబడ్డాయి. ఈ విధంగా దొడ్డయాచార్యస్వామి వారివల్ల ఈ ఆలయం, షోళింగర్ నగరం ఏర్పడ్డాయి. ఈ ఆలయ ప్రతిష్ఠ కీ.శ.1588వ సంవత్సరంలో పంగుని శుక్ల పక్ష పంచమి నాడు జరిగింది. చోళసింహపురంలోని కోవెలకైంకర్య నిర్వాహాలను ఈనాటికీ వీరి వంశస్థులే చేస్తున్నారు.



**షోళింగర్ లోని పుష్కరిణి (తక్కాంగుళం)**

ఒకానొక సందర్భంలో దొడ్డయాచార్యస్వామి వారు బ్రహ్మతీర్థం (తక్కాంగుళం) సమీపంలో పల్లకిలో వస్తున్నారు. అపుడు ఆ పల్లకీని మోసే బోయీలు అలసి, చాలా ఆకలితో ఉన్నారు. వారి స్థితిని గమనించిన దొడ్డయాచార్యస్వామి, ఒక విషవృక్షాన్ని తాకి దాని పండ్లను తినమని అన్నారు. బోయీలు భయంతోనే ఆ పండ్లను తిన్నారు. కానీ అవి వారికి చాలా తీయగా అనిపించాయి. ఈ సందర్భానికి గుర్తుగా ఈనాటికీ 'భక్తవత్సల స్వామి' కొండపై వేంచేసినపుడు, ఈ ఫలాలతో చేయబడిన 'అప్పం' అనే భక్ష్యం నివేదన చేయబడుతున్నది.

దొడ్డయాచార్యస్వామి వారి చరిత్రలో, తమకు క్షురకర్మ చేసే బీదవాడైన మంగలివానికి తమ బంగారు కేశాలను ఇవ్వడం ద్వారా అతని బీదరికాన్ని తీర్చడం మొదలైన ఎన్నో ఆశ్చర్యకరమైన విషయాలను గమనించవచ్చు.

ఆ రోజుల్లో శైవుల ప్రాబల్యం చేత చిదంబరంలోని 'తిల్లై గోవిందరాజన్' సన్నిధి మూతబడి ఉండేది. దొడ్డయాచార్యస్వామి వారు, వేదాంతదేశికుల 'శతదూషణి ' గ్రంథం సహాయంతో అద్వైత పండితుడైన అప్పయ్య దీక్షితులను వాదంలో ఓడించగా, ఆలయంలోని అడ్డుగోడ బ్రద్దలై, గోవిందరాజ పెరుమాళ్ళు వ్యక్తమయ్యారు. ఈ దృశ్యాన్ని వీక్షించిన అక్కడి రాజు వీరికి 'చండామారుతం 'అనే బిరుదుని ప్రదానం చేసాడు. ఈ విధంగా దొడ్డయాచార్యస్వామి వారి కృషితో గోవిందరాజ పెరుమాళ్ళు తిరిగి ప్రతిష్ఠింపబడ్డారు.

వీరు, తమ చివరికాలంలో శ్రీముష్ణక్షేత్రంలో నివసిస్తూ, వరాహస్వామికి కైంకర్యం చేసారు. అక్కడి పుష్కరిణికి సమీపంలో తీర్థవారి మండపానికి పక్కన వీరి

తిరువరసు (బృందావనం) కూడా ఉన్నది. శ్రీరంగంలో ఉడయవర్ సన్నిధిలో దొడ్డయాచార్యస్వామి వారి చిత్రాన్ని మనం దర్శించవచ్చు.







**శ్రీముష్ణంలోని దొడ్డయచార్యస్వామివారి తిరువరసు ఉన్న ప్రదేశం**







**శ్రీముష్ణంలోని దొడ్డయచార్యస్వామివారి తిరువరసు**

దొడ్డయాచార్యస్వామివారు దేశికుల 'శతదూషణి' అనే వాదగ్రంథానికి చండమారుతమనే వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు. దానికి గుర్తుగా వారి వంశస్థులు తమ పేరులో ఈనాటికీ చండమారుతమనే ఉపపదాన్ని కలిగి ఉన్నారు. ఉపనిషద్భాష్యకారులైన శ్రీరంగరామానుజమునికి, కాంచీపురం పంచమహాభంగ తాతాచార్య స్వామివారికి (అహోబిలమఠం 6వ పట్టాన్ని పొందిన అழగియశింగర్ కు శిష్యులు) దొడ్డయాచార్యస్వామివారు సమకాలికులు.

దొడ్డయాచార్యస్వామివారు 'సద్విద్యా విజయం', 'బ్రహ్మవిద్యా విజయం' మొదలైన అయిదు గ్రంథాలను (పంచ మహావిజయం), 'ఆచార్యవింశతి', 'శ్రుతితాత్పర్యనిర్ణయం', 'పారాశర్య విజయం', 'అధికరణార్థసంగ్రహం' మొదలైన గ్రంథాలను కూడా రచించారు.

మణవాళమహామునులకు 'అష్టదిగ్గజాలు' అనే 8 మంది పండిత మండలి ఉన్నట్లే, 'పొన్నడిక్కాల్ జీయర్'కు (మొదటి వానమమలై జీయర్) కూడా 'అష్టదిగ్గజాలు' ఉండేవారు. వీరిలో దొడ్డయాచార్యస్వామి వారు కూడా ఒకరు. ఈ దొడ్డయాచార్య స్వామి వారే **'రమ్యజామాతృ యోగీంద్ర పాదరేఖామయం సదా'** అనే వానమమలై జీయర్ తనియన్ శ్లోకాన్ని అనుగ్రహించారు. ఇంతేకాక, వారిపై 'ప్రపత్తి', 'మంగళాశాశనం' కూడా రచించారు.

19వ శతాబ్దంలో జీవించిన ప్రముఖ సంగీత విద్వాంసులైన ముత్తుస్వామి దీక్షితులు 'నరసింహ అగచ్ఛ' అనే ఒక కీర్తనలో దొడ్డయాచార్యస్వామిని స్మరించిట్లుగా భావింపబడుతున్నది.

**దొడ్డయాచార్యస్వామివారి ఇతర తనియన్లు:**

**సర్వసిద్ధి త్రయోదశ్యాం లగ్నే వేదప్రదాహ్వయే**

**జాతం కుంభోత్తరాషాఢే మహాగురుమహం భజే.**

(వేదప్రదాహ్వయం అనే లగ్నంలో, త్రయోదశి తిథిలో, కుంభమాసంలో, ఉత్తరాషాఢ నక్షత్రంలో అవతరించిన శ్రీనివాస మహాగురు అనే దొడ్డయాచార్యస్వామివారిని సేవిస్తున్నాను)

**శ్రీనివాహాచార్యప్రాప్తవేదాంతసంపదమ్,**

**లక్ష్మణార్యదయాపాత్రం శ్రీనివాసమహాగురుమ్.**

(శ్రీనివాసాచార్యులనే తమ తండ్రి దగ్గరనుండి వేదాంతశాస్త్రాన్ని అభ్యసించినవారు, లక్ష్మణాచార్యుల (రామానుజాచార్యుల) వారి దయకు పాత్రమైనవారైన శ్రీనివాసగురువును (దొడ్డయాచార్యులవారిని) స్తుతిస్తున్నాను)

**దొడ్డయాచార్యస్వామివారి వాళ్ళి తిరునామాలు:**

**మాశి ఉత్తరాడత్తిల్ వందుదిత్తాన్ వాళ్ళియే,**

**మాశిల్ పుగ*ళ్* పెరియప్పన్ మగి*ళ్*న్ద మైన్దన్ వాళ్ళియే,**

**దేశమెన్గుమ్ పరవతిశయమ్ పడైత్తాన్ వాళ్ళియే,**

**దరిశనత్తై ఉద్దరిత్తు తెళివిత్తాన్ వాళ్ళియే,**

**ఆశిల్ యెతిరాశర్ నిగరాన గురు వాళ్ళియే,**

**ఐన్దు విజయంగళుమ్ అరుళినాన్ వాళ్ళియే,**

**తూశిల్ వాధూల కులమ్ తులంగ వన్దోన్ వాళ్ళియే,**

**తూయ మహాదేశికనార్ తుణైప్పదంగళ్ వాళ్ళియే.**

(మాఘ మాసం ఉత్తరాషాఢా నక్షత్రంలో ఈ భూమిలో అవతరించినవారికి మంగళం;
ఏదోషంలేని కీర్తిని కల పెరియప్పన్ స్వామిని ఆనందింపజేసిన కుమారునకు మంగళం;
దేశమంతా వ్యాపించిన గొప్పకీర్తిని కలవారికి మంగళం;
విశిష్టాద్వైత దర్శనాన్ని ఉద్ధరించి స్పష్టం చేసినవారికి మంగళం;
దోషంలేని భగవద్రామానుజులతో సమానమైన వారికి మంగళం;
ఐదు విజయాలను అనుగ్రహించిన వారికి మంగళం;
ఏ దోషంలేని వాధూల కులం ప్రకాశింటేటట్లు అవతరించినవారికి మంగళం;
అతిపవిత్రమైన దొడ్డయాచార్య స్వామివారి శ్రీచరణాలు రెండిటికీ మంగళం.)

※※※※※※

# దేవాధిరాజపంచకం– సవ్యాఖ్యానమ్

**"తక్కానై కడిక్కై త్తడమ్ కున్టిన్ మిశై యిరుంద అక్కారక్కనియై అడైందుయ్ న్దు పోనేనే"** (ఘటికాచలం కొండ శిఖరంపై వేంచేసి ఉండేవాడు, తగిన స్వరూపాన్ని కలవాడు, కలకండ వలే తీయనివాడు అయిన స్వామిని ఆశ్రయించి తరించాను) అని తిరుమంగై ఆழ்వార్ కీర్తించిన, **'చోళసింహపురం'** అని లోకంలో పిలువబడే తిరుక్కడిక్కై అనే దివ్యదేశంలో మహావిద్వాంసులై వేంచేసి ఉన్న దొడ్డయాచార్య స్వామివారు, ప్రతి సంవత్సరం కంచిలో వరదరాజస్వామికి జరిగే లోకప్రసిద్ధమైన గరుడసేవ ఉత్సవంనాడు అక్కడకు వెళ్లి, ఆ ఉత్సవాన్ని సేవించి ఆ స్వామికి కైంకర్యాలను చేసి ఆనందించేవారు. ఒక సంవత్సరం వారికి ఆ విధంగా సేవించే అవకాశం లేకపోయింది. **"అత్తియూరాన్ పుళ్ళై ఊర్వాన్"** (కంచిలో ఉండే వరదరాజ స్వామి గరుడవాహనాన్ని ఎక్కి వేంచేస్తాడు) అనే పూదత్తాழ்వారుల సూక్తిని మనసులో భావిస్తూ గరుడసేవ దృశ్యాన్ని మనసులో చింతిస్తూ, వారు ఉండిపోయారు. ఆ మహాభక్తుల మనోరథాన్ని తీర్చదలచిన వరదరాజస్వామి, కంచిలో అందరికీ గరుడసేవను అనుగ్రహించినట్లే, చోళసింహపురంలో కూడా దొడ్డయాచార్యస్వామికి తన సేవను అనుగ్రహించాడు. అప్పుడు వారు తమ అనుభవ పరివాహరూపంగా అనుగ్రహించిన ఐదు శ్లోకాలు దేవాధిరాజ పంచకం అనే పేరుతో ప్రసిద్ధమైనది. ఈ ఐదు శ్లోకాలలో కంచి గరుడోత్సవ వైభవం వర్ణింపబడింది.

**1) ప్రత్యూషే వరదః ప్రసన్నవదనః ప్రాప్తాభిముఖ్యాన్ జనాన్**
**ఆబద్ధాఞ్జలిమస్తకా నవిరలా నాబాలమానన్దయన్ ।**
**మన్దోద్దాయితచామరో మణిమయశ్వేతాతపత్రః శనైః**
**అన్తర్గోపుర మవిరాస భగవానారూఢపక్షీశ్వరః ॥**

ప్రత్యూషే — ప్రభాత కాలంలో, ప్రసన్న వదనః — స్వచ్ఛమైన ముఖాన్ని కల వరదరాజ స్వామి, ప్రాప్తాభిముఖ్యాన్ — తనను సేవించి, ఆనందించాలి అనే ఆశను కలిగినవారు, బద్ధాంజలి మస్తకాన్ — తమ తలలపై పైకెత్తి జోడించి పెట్టుకొనిన, అంజలి ముద్రలను కలిగిన చేతులు కలవారైన, అవిరళాన్ జనాన్ — అంతులేని సంఖ్యలో ఉండే భక్తులను, ఆ బాలమ్ ఆనందయన్ — చిన్న పిల్లలనుండి ఆనందింప చేస్తూ ఉండేవాడై, ఆరూఢ పక్షీశ్వరః — గరుడవాహనాన్ని అధిరోహించినవాడై, మందోద్దాయితచామరః — మెల్లిగా పైకెత్తి పట్టుకుని అటూ ఇటూ వీస్తున్న చామరాలను కలిగినవాడై, మణిమయ శ్వేత ఆతపత్రః — రత్నాలు పొదిగిన, తెల్లని గొడుగులను కలవాడై, శనైః — మెల్లిగా, అంతః గోపురమ్ ఆవిరాస — రాజగోపురంలో ఆవిర్భవించాడు.

ప్రభాత సమయంలో ప్రసన్నమైన ముఖాన్ని కలిగిన వరదరాజస్వామి — అభిముఖులై, తలలపై అంజలి ముద్రను కలవారై, కిక్కిరిసి ఉన్నవారై ఉండే భక్తులను చిన్న పిల్లలనుండి పెద్దల వరకు అందరిని సంతోషింపచేస్తూ, గరుడుని వాహనంగా కలవాడై, మెల్లిగావీచే చామరాలను కలవాడై, తెల్లని గొడుగులను కలవాడై, మెల్లి మెల్లిగా రాజగోపురంలో ఆవిర్భవించాడు.

శ్రీ వరదరాజ స్వామి, పెరియ తిరువడి తిరుణాళ్ళను మొదటి క్షణం నుండి కవి దొడ్డయాచార్య స్వామి అనుభవిస్తున్నారు. అరుణోదయ కాలంలో అభిమత జన దర్శనానందవేగంచేత అవతార సమాధిని దాటి, బయటికి వస్తున్న అవ్యక్తమైన మధుర మందహాస విలాసంతో కూడిన తిరుముఖ మండలంతో వెలిగే వరదరాజ స్వామి **"శిరస్యంజలి మాదాయ"** (తలపై అంజలిని పెట్టుకొని) అని, **"మత్తకత్తినిడై కైకూప్పి"** (తలలపై చేతులను జోడించి పెట్టుకొని) అని పలికిన రీతిలో తలలపై అంజలి చేసిన హస్తముద్రలను కలవారై, "నేను ముందు అంటే నేను ముందు" అని ముందుకు వస్తూ ఉండేవారు, ఒకరిని ఒకరు తోసుకుంటూ ఉండే వారైన భక్తులను చిన్నవారినుండి పెద్దవారివరకు ఏ తేడా లేకుండా అందరిని ఆనందింప చేస్తూ, **"కాయ్ చ్చినై పఱవై ఊర్ న్దు"** (మిక్కిలి కోపం కలిగిన గరుడుని అధిరోహించి) అని కీర్తింపబడేవాడు, **"పొన్ మలైయిన్ మీమిశై క్కార్ ముకిల్"** (మేరుపర్వతంపై నల్లని మేఘంవలె) అనే విధంగా కీర్తింపబడేవాడైన గరుడుని అధిరోహించి, తెల్లగా ప్రకాశించే గొడుగులను పట్టుకునే అందం, చామరాలను పట్టుకొని వీస్తున్నప్పుడు తోచే అందం – అనే దీనిని కలవాడై, గోపురసేవ అనుగ్రహించే రీతి "ఆహా! ఎంత గొప్పది!" అని కవి అభినివేశాన్ని పొందుతున్నారు.

వరదరాజస్వామి పేరు 'పేరరుళాళన్'. అందువల్ల అతడు తనలో భక్తులపట్ల ఉండే కృపను వ్యక్తం చేస్తూ ప్రసన్నమైన వదనంతో వేంచేస్తున్నాడు. ఆ సమయంలో మోగింపబడే ధ్వనివాద్యాలు వరదరాజస్వామి వేంచేసే విషయాన్ని సూచిస్తున్నాయి. ఈ వాద్యాలు చేసే ధ్వనిని, ఆ ధ్వనిలో వ్యక్తమయ్యే విశేషాలను స్మరించినప్పుడు

వేదాంతదేశికులు అనుగ్రహించిన 'తిరుచ్చిన్నమాలై' అనే ప్రబంధంలోని పాశురాలు మనకు తప్పక గుర్తుకువస్తాయి.

❖ **శురర్గళుక్కు అన్రు అముదరుళ్ సుందరనార్ వన్దార్**

(పాలసముద్రాన్ని చిలికి దేవతలకు అమృతాన్ని ఇచ్చిన సుందరుడు వేంచేసాడు)

❖ **వానేర వ*ழி*తందార్ వన్దార్ తామే**

(మోక్షాన్ని పొందడానికి తగిన ఉపాయాలను అనుగ్రహించిన స్వామి వేంచేసాడు)

❖ **నినైక్క నమక్కు ఇన్నటివు తందార్ వన్దార్**

(తనను ధ్యానించడానికి తగిన తీయని భావనను అనుగ్రహించిన స్వామి వేంచేసాడు)

❖ **శేమ్మేణ్ణి యెమ్మై అన్బర్కడైత్తార్ వన్దార్**

(మన క్షేమాన్ని తలచి తన భక్తులకు మనలను వశంచేసిన స్వామి వేంచేసాడు)

❖ **తిలకమెనుం తిరుమేనిచ్చెల్వర్ వన్దార్**

(అందమైన దివ్యమంగళ విగ్రహం కలిగిన స్వామి వేంచేసాడు)

❖ **అరుళాలే విలంకిరణ్డుమ్ అ*ழி*ప్పార్ వన్దార్**

(కృపతో మనకు కల రెండువిధాలైన్ (పుణ్య, పాపాలనే) సంకెళ్ళను తొలగించినవాడు వేంచేసాడు)

**❖ పుగలిల్లార్ పుగలాగుం పునిదర్ వన్దార్**

(వేరు ఉపాయంలేని భక్తులకు తానే ఉపాయం అవుతున్న పవిత్రుడు వేంచేసాడు)

**❖ అంజిన నీ ఎన్నై అడై ఎన్టార్ వన్దార్**

(ఇతరోపాయాలను అనుష్ఠించడానికి భయపడిన నీవు నన్ను ఆశ్రయించు – అని పలికిన స్వామి వేంచేసాడు)

**❖ కరుద వరన్దరుం దెయ్ వప్పెరుమాళ్ వన్దార్**

(ఆరాధించినవారికి వరాలను ఇచ్చే స్వామి వేంచేసాడు)

**❖ ముత్తి మళైపొழియుం ముగిల్ వణ్ణర్ వన్దార్**

(ముక్తి వర్షాన్ని కురిపించే మేఘవర్ణుడు వేంచేసాడు)

ఇటువంటి దేశికుల సూక్తులన్నీ, కవికి ఈశ్లోకాన్ని రచించినపుడు మనస్సులో మెదిలి ఉండవచ్చు.

**2) ముక్తాతపత్రయుగళోభయచామరాన్త**
**ర్విద్యోతమానవినతాతనయాధిరూఢమ్ ।**
**భక్తాభయప్రదకరామ్బుజ మంబుజాక్షం**
**నిత్యం నమామి వరదం రమణీయవేషమ్ ॥**

ముత్తాతపత్రయుగళౌ – తెల్లని ముత్యాలతో అలంకరింపబడిన గొడుగులతో, ఉభయ – రెండు వైపులా వీస్తున్న చామరాల, అంతః – మధ్యలో, విద్యోతమాన – గొప్పగా ప్రకాశిస్తున్న, వినతా తనయ అధిరూఢమ్ – వినతాదేవి కుమారుడైన గరుడునిపై అధిరోహించి వేంచేసి ఉండేవాడు, భక్తాభయప్రద – తన భక్తులకు అభయాన్ని ఇచ్చే, కరాంబుజం – తామరవంటి చేతులను కలిగినవాడు, అంబుజాక్షం – చల్లని తామర పువ్వువంటి ముఖాన్ని కలిగినవాడు, రమణీయవేషం – గొప్పగా వెలిగే అలంకారాన్ని కలవాడు, వరదం – వరప్రదుడైన దేవాధిరాజస్వామిని, నిత్యం – ఎల్లప్పుడు, నమామి – నమస్కరిస్తున్నాను.

రెండు తెల్లని ముత్యాల గొడుగులు, రెండు చామరాలు – అనే ఈ రెండిటి మధ్య వెలుగుతున్న వినతాదేవి కుమారుడైన గరుడునిపై అధిరోహించి ఉండేవాడు, భక్తులకు అభయాన్ని ఇచ్చే తామరవంటి శ్రీ హస్తాన్ని కలవాడు, అందమైన ఎర్రని తామర పువ్వంటి  కన్నులను కలవాడు, మనసును దోచే గొప్ప అలంకారాలను కలవాడైన వరదరాజస్వామిని నిత్యం నమస్కరిస్తున్నాను.

వేదాంతదేశికులు శ్రీవరదరాజ పంచాశత్ అనే స్తోత్రంలో తాము ఈ భూమిపై ఉన్నంత కాలం రెప్పపాటులేకుండా వరదరాజస్వామి వాహనోత్సవాలను సేవించాలని ఆశపడిన శ్లోకం ఇక్కడ స్మరించదగినది.

**తురగ విహగ రాజ స్యందనాందోళికాదిషు**
**అధికమధికమన్యాం ఆత్మశోభాం దధానమ్**
**అనవధికవిభూతిం హస్తిశైలేశ్వరం త్వాం**
**అనుదినమనిమేషైః లోచనైః నిర్విశేయమ్**

(వరదరాజస్వామి అశ్వవాహనం, గరుడవాహనం, రథం, పల్లకి మొదలైన వాహనాలలో బ్రహ్మోత్సవాలలో వేంచేస్తాడు. ఆ సమయంలో స్వామి వైభవాన్ని, అందాన్ని నిత్యంగా ప్రతిదినం అన్నివాహనాల సేవలను కనురెప్పపాటు లేకుండా దర్శించాలి) అని దేశికులు ఈ శ్లోకంలో తమ ఆశావిశేషన్ని వ్యక్తం చేశారు.

భగవద్యామునులు కూడా 'స్తోత్రరత్నం'లో గరుడుడు భగవంతునకు పలువిధాలుగా చేసే సేవలను – "**దాసస్సఖా వాహనమాసనం ధ్వజః, యస్తేవితానం వ్యజనం త్రయీమయః, ఉపస్థితం తేన పురో గరుత్మతా, త్వదంఘ్రి సమ్మర్ద కిణాంకశోభినా**" అనే శ్లోకంలో వ్యక్తం చేశారు. ఈ శ్లోకంలో యామునులు వేదస్వరూపి అయిన గరుడుడు దాసుడుగాను, స్నేహితుడుగాను, వాహనంగాను, ధ్వజంగాను, మేల్ కట్టుగాను, విసనకర్రగాను భగవంతుని ముందు నిలచి కైంకర్యం చేస్తాడని, ఆ గరుడుని శరీరం అంతా భగవంతుని పాదాల తాకిడి వల్ల ఏర్పడిన కాయలతో శోభిల్లుతున్నదని తెలియజేసారు.

ఇటువంటి గరుడుని సేవలను దర్శించాలని యామునులు ఆశపడినట్లే, ఇక్కడ దొడ్డయాచార్యస్వామి వారు కూడా గరుడసేవను దర్శించాలని కుతూహలంతో ఆశపడుతున్నారు.

గరుడసేవ సమయంలో వరదరాజస్వామికి ఉపయోగపడే ఏనుగులు, గుఱ్ఱాలు, చామరాలు, గొడుగులు, ధ్వజాలు మొదలైన పరికారలు అన్నీ ఆ స్వామియొక్క జగదేక చక్రవర్తిత్వాన్ని సూచిస్తాయి. వాటిలో ఇపుడు దొడ్డయాచార్య స్వామి వారు, గొడుగులు, చామరాలు అనే రెండు పరికరాలను ఈశ్లోకంలో వర్ణిస్తున్నారు. తెల్లని విశాలమైన ముత్యాలుపొదిగిన రెండు గొడుగులు, రెండు తెల్లని చామరాలు ఇందులో ప్రస్తావింపబడుతున్నాయి.

గొడుగులలో పొదిగిన తెల్లని ముత్యాలు శుద్ధసత్వ గుణాన్ని సూచిస్తాయి. అంతేకాదు, అవి భగవంతుని సర్వశేషిత్వాన్ని సూచించే దివ్యసూరుల పాశురాలకు గుర్తు. ఇక్కడ, జీవ–పరమాత్మల మధ్య ఉండే శేష–శేషి సంబంధం సూచింపబడుతున్నది.

గొడుగులలో పొదిగిన ముత్యాలు వరదరాజస్వామికి ఉపయోగపడడం, సహజంగా శుద్ధమైన స్వభావాన్ని కలిగిన జీవుడు భగవంతునకు చేయదగిన కైంకర్యాన్ని సూచిస్తున్నది. ముత్యాల తెల్లని వెలిగే కాంతి చాలా పవిత్రమైనది. ఎందుకంటే, అవి చంద్రుని శోభను గుర్తుచేస్తున్నాయి. ముత్యాలవల్ల వ్యక్తమయ్యే ఇటువంటి ఎన్నో విశేషాలు, దేశికులు 'పాదుకాసహస్రం'లో ముక్తా పద్ధతిలో అనుగ్రహించిన సూక్తులను బట్టి స్మరించవచ్చు.

గొడుగులకు పొదిగిన తెల్లని ముత్యాలు స్వామిని సూర్యకాంతి నుండి రక్షించి, సేవిస్తున్నాయి. గొడుగులు ఈ విధంగా విశాలంగా విస్తరించి వరదరాజస్వామి

శిరస్సును ఆచ్ఛాదిస్తూ ఉండడం, ఆదిశేషుదు తన పడగలను విప్పి పెద్దవి చేసి భగవానును శిరస్సుపై నిలిపి కైంకర్యంచేస్తున్నట్లు తోస్తున్నది – అని దేశికులు ముక్తాపద్ధతిలో భావించారు.

అంతేకాక, వారు ఇంకొక శ్లోకంలో – పాదుకలలోని ముత్యాల వరుసలు భవిష్యత్తును సూచించే నక్షత్రాల వరుసలను సూచిస్తున్నవని అన్నారు. అవి, తెల్లని కాంతులను ప్రసరింపజేస్తూ, తమలోని సత్వ గుణాన్ని ప్రదర్శిస్తూ, స్వామిని ఎండవేడిమి నుండీ కాపాడుతూ, సేవచేస్తున్నట్లు ఉన్నాయి అని అన్నారు. ఈ భావాన్ని మనం ఇక్కడ గొడుగుల విషయంలో అనుసంధించుకోవచ్చు.

వరదరాజస్వామి ఉత్సవంలో దర్శనమిచ్చే గొడుగులు, ఆ స్వామియొక్క చక్రవర్తిత్వాన్ని సూచిస్తున్నాయి. చామరాలు సర్వేశ్వరత్వాన్ని సూచిస్తున్నయి.

గరుడవాహనంపై వేంచేసే వరదరాజస్వామి, అభయ ముద్రను కలిగి ఉన్నాడు. ఈ అభయముద్ర, చరమశ్లోకంలోని 'మాశుచః' అనే సూక్తిని గుర్తుకు తెస్తున్నవి. ఈ సంసారంలో పడి ఆర్తిని పొందే జీవుల విషయంలో తనకుగల వాత్సల్యాన్ని ఈ ముద్రద్వారా వ్యక్తంచేస్తూ వారికి అభయాన్ని అందిస్తున్నాడు స్వామి. ఈ అభయముద్ర ద్వారా వరదరాజస్వామి మనం ఊహించలేనన్ని వరాలను మనకు అనుగ్రహిస్తున్నాడు. దేశికులు 'ఉపకార సంగ్రహం' అనే రహస్యగ్రంథంలో:

**"అ*ళ్గి*యాద అరుళా*ళ్గి* పెరుమాళ్ శెయ్యుమ్ అన్దమిల్లా ఉదవి యెల్లామ్ అళప్పార్ ఆరే?"**

(భగవంతుడు చేసే సహాయం అంతులేనిది. అభయప్రదాన ముద్ర ద్వారా ఈ విషయం వ్యక్తం చేయబడుతున్నది. ఏనాటికీ నశించని సుదర్శనాన్ని చేతిలో ధరించిన భగవంతుడు మనక చేసే అంతులేని ఉపకారాలను ఎవరు ఇన్ని అని లెక్కకట్టగలరు) – అని అనుగ్రహించారు.

'సారసారం' అనే చిల్లర రహస్యంలో దేశికులు ఈవిధంగా అనుగ్రహించారు: **"సమస్త ప్రతిబంధక నివృత్తి పూర్వక మత్ప్రాప్త్యై కృతార్థన్ ఆక్కుగిఱేన్"** (ఓ జీవుడా!, నీ ఉపాయాంతరాలను పెక్కింటిని ఆచరించలేవు. అందువల్ల నాపాదాలలో శరణాగతిని చెయ్యి. నానుండి రక్షణను కోరుకో. నేను శరణాగత వాత్సల్యం మొదలైన గుణాలను కలిగినవాడను. అందువల్ల, ప్రపన్నుడవైన నిన్ను రక్షిస్తాను. నీకు ఎదురయ్యే ఆటంకాలను అన్నింటినీ తీరుస్తాను.అందువల్ల, నువ్వు దేనివల్లా భయపడవలసిన అవసరం లేదు)

భగవంతుడు సర్వలోక శరణ్యుడు. అటువంటి స్వామి వైభవం ఆ స్వామి అభయముద్రలో వ్యక్తమౌతున్నది. భగవంతుని సర్వలోక శరణ్యత్వం శ్రీరామాయణంలోని **"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచ యాచతే, అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ"** అనే సూక్తిలో వ్యక్తమౌతున్నది.

దొడ్డయాచార్యస్వామివారు ఈ రెండవ శ్లోకంలో ఈ విశేషాలను అన్నిటినీ 'రమణీయవేషం', 'అభయప్రద కరాంబుజం' అనే రెండు చక్కని ప్రయోగాలద్వారా వ్యక్తం చేశారు.

**3) కేచిత్తత్త్వవిశోధనే పశుపతౌ పారమ్య మాహుః పరే**

**వ్యాజహ్రుః కమలాసనే నయవిదా మన్యే హరౌ సాదరమ్ ।**

**ఇత్యేవం చలచేతసాం కరధృతం పాదారవిన్దం హరేః**

**తత్త్వం దర్శయతీవ సంప్రతి నృణాం తార్ క్ష్యః శ్రుతీనాం నిధిః ॥**

తత్త్వవిశోధనే — పరతత్త్వాన్ని అన్వేషించే విచారంలో, నయవిదాం — శాస్త్ర విచారరీతిలో న్యాయాలను తెలిసినవారిలో కొందరు, పశుపతౌ — పశుపతి అయిన త్రినేత్రుని విషయంలో, పారమ్యం — పరత్వాన్ని, ఆహుః — పలుకుతున్నారు, పరే — మరికొందరు, కమలాసనే — తామరను ఆసనంగా కలిగిన చతుర్ముఖుని విషయంలో, పారమ్యం — పరత్వాన్ని, వ్యాజహ్రుః — పలుకుతున్నారు, అన్యే — ఇతరులు, సాదరం — ఆదరంగా, హరౌ — పాపాలను హరించే శ్రీమన్నారాయణుని విషయంలో, పరత్వాన్ని పలుకుతున్నారు, ఇత్యేవం — ఈ విధంగా, చలచేతసాం — చంచలమైన బుద్ధిని కల, నృణాం — మానవుల విషయంలో, శృతీనాం నిధిః — వేదాల నిధి అయిన, తార్ క్ష్యః — గరుడుడు, సంప్రతి — ఇప్పుడు ఈ గరుడవాహన సేవ సమయంలో, కరధృతం — తన పైకి ఎత్తి పట్టుకొని చేతులలో ధరించిన, హరేః — శ్రీమన్నారాయణుని, పాదారవిందం — తామర వంటి శ్రీచరణాలను, తత్వం — పరతత్వంగా (వరదరాజ స్వామి **"అహమేవ పరం తత్త్వమ్"** అని తనను పరతత్వంగా పలికిన రీతిని), దర్శయతి ఇవ — తెలుపుతున్నట్లుగా తోస్తున్నది.

పరతత్వం ఏది ? – అని విచారించేటప్పుడు, శాస్త్రాన్ని తెలిసినవారిలో కొందరు శివుని విషయంలో పరతత్వాన్ని పలుకుతున్నారు. మరికొందరు బ్రహ్మ విషయంలో పరతత్వ భావనను పలుకుతున్నారు. ఇంకా మరి కొందరు శ్రీమన్నారాయణుని విషయంలో పరతత్వ బుద్ధిని తెలుపుతున్నారు. ఈ విధంగా పలువురు పలురీతులలో పలుకుతున్నారే! ఒకే విధమైన నిర్ణయం లేదే! అని చంచలమైన మనస్సును కలవారికి సత్యాన్ని స్పష్టం చేయడం కోసం, వేదాలకు నిధి అయిన గరుడుడు ఇప్పుడు ఈ గరుడోత్సవం సమయంలో, వరదరాజ స్వామి పాదారవిందాలను తన చేతులతో పైకి

ఎత్తి పట్టుకొనిన రీతిని చూస్తే "ఇవే పరతత్వం సుమా!" అని తెలుపుతున్నట్లుగా ఉన్నది.



గరుడుడు వరదరాజస్వామి శ్రీచరణారవిందాలను తన చేతులలో ఎత్తి పట్టుకొని రావడం చూసిన కవి, ఒక ఉత్ప్రేక్షను పలుకుతున్నారు, ఈ శ్లోకంలో. సమ్యక్ న్యాయానుగృహీత ప్రమాణ పరామర్శతోను (చక్కని న్యాయాలతో కూడుకొన్న విచారణతోను), సదాచార సేవవల్ల సందేహం లేకుండా పరతత్వాన్ని నిశ్చయించడంలో సామర్థ్యం లేక, చంచలమైన బుద్ధిని కలవారికి ఒక స్పష్టతను కలిగించాలని తలచిన వేదస్వరూపి అయిన గరుడుడు, "శ్రీమన్నారాయణుని చరణారవిందాలే సుమా పరతత్వం!" అని వాటిని తన చేతులలో పెట్టుకొని చూపుతున్నట్లుగా ఉన్నది — అని ఈ శ్లోకంలో కవి పలుకుతున్నారు. ఒక పక్షి చూపిస్తే

ఇదే తత్వం అని విశ్వసించే అవకాశం ఉన్నదా ? – అనే సందేహానికి అవకాశం లేనివిధంగా గరుడునకు **"శృతీనాం నిధిః"** (వేదాలకు నిధి) అని ఒక విశేషణాన్ని ప్రయోగించారు, **"వేదాత్మా విహగేశ్వరః"** (గరుడుడు వేదస్వరూపుడు) అని యామునులు కూడా అన్నారు. **"సుపర్ణోసి గరుత్మాన్ త్రివృత్తే శిరః"** (గరుత్మంతుడా!, నీవు చక్కని రెక్కలను కలవాడవు. నీ శిరస్సు, త్రివృత్ అనే వేదభాగం) అని ఈ విధంగా ఉండే వేదవాక్యం కూడా ఇక్కడ అనుసంధేయం.

గరుడ భగవానుడు, భగవంతుని శ్రీచరణాలను తన చేతిలో పెట్టుకొని వానిని అందరకూ చూపిస్తూ – ఇవే అందరకూ సేవించదగినవని సూచిస్తున్నాడు. కూరేశులు వరదరాజస్తవం ఆరంభంలో **"స్వస్తి హస్తిగిరి మస్తశేఖరః సంతనోతు మయి సంతతం హరిః, నిస్సమాభ్యధిక మభ్యధత్త యం దేవ మౌపనిషది సరస్వతీ"** అని అంటూ వేదాలు భగవత్తత్వాన్ని తెలుసుకోవడంలో చేసిన ప్రయత్నాన్ని ప్రస్తావిస్తూ, అని ఏవిధంగా దానిని తెలియజేసాయో సూచించారు. వరదరాజస్వామి తనతో సాటి–మేటి లేని చక్రవర్తి; ఉపనిషత్తులు ఈవిషయాన్ని చక్కగా వ్యక్తం చేస్తున్నాయి – అని ఈశ్లోకంలో కూరేశులు అన్నారు.

కూరేశులు 'వరదరాజపంచాశత్' అనే స్తోత్రంలోని 59వ శ్లోకంలో (స్వామీ!, నీ శ్రీచరణాలు భక్తియోగ నిష్ఠుల హృదయాలలో వికసిస్తున్నాయి. శ్రీవైకుంఠంలో అవి ఆధారపద్మంలో ఉన్నయి. ఆ పాదాలే వేదాంతాలను భూషిస్తున్నాయి. అవే, నమ్మాళ్వార్ల శిరస్సును రత్నాలవలె అలంకరిస్తున్నాయి. అవి, హస్తిగిరి శిఖరాన్ని నివాసంగా కలిగి, అక్కడ గొప్పగా ప్రకాశిస్తున్నాయి. వరదరాజస్వామీ, వీటిలో దేనిని నీవు ఎక్కువగా అభిమానిస్తావు?) – అని చమత్కరిస్తూ ప్రశ్నించారు.

దొడ్డయాచార్య స్వామివారు అనుగ్రహించిన ఈ మూడవశ్లోకంలోని రెండవ పాదం, వేదాంత దేశికుల 'వరదరాజపంచాశత్' స్తోత్రంలోని పదమూడవ శ్లోకంలోని అర్థాన్ని స్మరింపజేస్తుంది. ఆ శ్లోకం ఈవిధంగా సాగింది:

**"ఆశాధికేషు గిరిశేషు చతుర్ముఖేష్వపి**

**అవ్యాహతా విధి నిషేధమయీ తవాజ్ఞా**

**హస్తీశ నిత్యమనుపాలన లంఘనాభ్యాం**

**పుంసాం శుభాశుభమయాని ఫలాని సూతే"**

(వరదరాజస్వామీ!, దిక్పాలకులను, రుద్రుని, బ్రహ్మను ఆదేశించే నీ ఆజ్ఞ, విధినిషేధ రూపంలో ఉన్నది. వాటిని అనుసరించినవారికి మంచిఫలితం, అనుసరించనివారికి దుష్ఫలితం లభిస్తున్నందున, అవి నీ సాటిలేని అధికారాన్ని సూచిస్తున్నవి)

దొడ్డయాచార్యస్వామివారు ప్రస్తుత శ్లోకంలో రెండవపాదంలో ఈవిషయాన్ని ప్రస్తావన చేస్తూ, "**యద్బ్రహ్మరుద్ర సురనాయక మౌళి వంద్యం"** అని అన్నారు.

**4) యద్వేదమౌలిగణవేద్య మవేద్యమన్యైః**

**యద్ బ్రహ్మరుద్రసురనాయకమౌలివంద్యమ్ ।**

**తత్పద్మనాభపదపదయుగ్మమిదం మనుష్యైః**

**సేవ్యం భవద్భిరితి దర్శయతీవ తార్ క్ష్యః ॥**

పద్మనాభ – నాభిలో పద్మాన్ని కలిగిన వాడైన, భగవానునియొక్క, యత్ – పదపద్మం తామరవంటి శ్రీచరణం, వేదమౌళిగణ – వేదాంతాల సమూహంతో,

వేద్యం – తెలుసుకోదగినది, అన్యైః – అవైదికులైన మిగిలినవారిచే తెలిసికోవడానికి సాధ్యం కానిది, బ్రహ్మ రుద్ర సురనాయక– బ్రహ్మ, శివుడు, దేవేంద్రుడు మొదలైనవారు, మౌళివంద్యం – తమ శిరస్సులతో నమస్కరింపబడేది అయిన, తత్ – అటువంటి, ఇదం – ఈ శ్రీచరణమే, భవద్భిః – మానవులైన మీచేత, సేవ్యం – సేవించదగినది అని, తార్ క్ష్యః – గరుడుడు, దర్శయతీవ – చూపిస్తున్నట్లుగా ఉన్నది.

భగవంతుని ఏ శ్రీచరణం వేదాంతాలకు మాత్రమే తెలియదగినదో, అవైదికులకు తెలియడానికి సాధ్యం కాదో, ఏ శ్రీచరణాన్ని బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు అనే వీరు తమ శిరస్సులను తాకించి ప్రణమిల్లుతున్నారో, అటువంటి వరదరాజస్వామి శ్రీచరణం మీకు సేవించ దగినది – అని గరుత్మంతుడు ఉపదేశిస్తున్నట్లుగా ఉన్నాడు.

గరుడాళ్వాన్ తనచేతులలో వరదరాజస్వామి శ్రీచరణాలను మోస్తూ, జీవులనందరినీ ఆహ్వానిస్తూ, అవే అందరికీ శరణ్యమని తెలియజేస్తున్నాడు. పలుజన్మలను ఎత్తే జీవులకు ఆ పాదాలే ఆ జన్మలనుండీ విమోచనాన్ని కలిగిస్తాయని తెలియజేస్తూ, అతడే సర్వరక్షకుడని, సర్వశక్తి అని ఉపదేశిస్తున్నాడు. ఈవిధంగా గరుడభగవానుడు పరతత్వ నిర్ణయాన్ని తత్వవేత్తలు చేసిన రీతిలో తెలియజేస్తూ, మనకు ఎంతో ఉపకారపడుతున్నాడు. అందువల్ల, కంచి గరుడసేవ పరతత్వ నిర్ణ్యాన్ని ప్రకాశింపజేసే గొప్ప ఉత్సవంగా ప్రకాశిస్తున్నది.

## 5) ప్రత్యగ్గోపురసంముఖే దినముఖే పక్షీన్ద్రసంవాహితం
## నృత్యచ్చామరకోరకం నిరుపమచ్ఛత్రద్వయీభాసురమ్ ।

**సానన్దం ద్విజమణ్డలం విదధతం సన్నాహచిహ్నైః రవైః**
**కాన్తం పుణ్యకృతో భజన్తి వరదం కాంచ్యాం తృతీయోత్సవే ॥**

కాంచ్యాం – కాంచీనగరం అనే దివ్యదేశంలో, తృతీయోత్సవే – వరదరాజ స్వామి బ్రహ్మోత్సవాలలో జరిగే మూడవ ఉత్సవంలో, దినముఖే – దినం ప్రారంభమయ్యే ప్రాతఃకాల వేళలో, పక్షీంద్రః – పక్షిరాజు అయిన గరుత్మంతుడు, సంవాహితం – తన భుజాలలో మోయబడేవాడు, నృత్యచ్చామర గోచరం – తామర మొగ్గలవంటి కదలాడే చామరాలచేత వీచబడేవాడు, నిరుపమచ్ఛత్రద్వయం – సాటి లేని రెండు గొడుగుల నీడలో, భాస్వరం – ప్రకాశించేవాడు, సన్నాహ – వీధిలో వేంచేయడానికి సిద్ధంగా ఉన్నాడు - అని తెలిపే గుర్తులైన, ఆరవైః – కాహళ ధ్వనులతో, ద్విజమండలం – గోష్ఠిగా నిలిచి ఉండి, ఉభయ వేదాలను అధ్యయనం చేసే బ్రాహ్మణులు సమూహానికి , ఆనందం విదధతం – ఆనందాన్ని పొందించేవాడు, కాంతం – గొప్ప అందాన్ని కలిగినవాడు అయిన, వరదం – మనోరథాలను అనుగ్రహించే వరదరాజ స్వామిని, పుణ్యకృతః – పుణ్యం చేసినవారు, ప్రత్యక్ గోపుర సంముఖే – పడమటి దిక్కులో ఉండే గోపుర ద్వారంలో, భజంతి – కీర్తించి, నమస్కరించి, కైంకర్యం చేస్తున్నారు.

కాంచీ నగరంలో మూడవ ఉత్సవంనాడు సుప్రభాత సమయంలో గరుడునిచే మోయబడేవాడు, చామరాలచేత వీచబడేవాడు, సాటి లేని రెండు తెల్లని గొప్ప గొడుగుల మధ్యలో ప్రకాశించేవాడు, ఉత్సవవేళ సిద్ధం అయినది – అని తెలిపే వాద్యధ్వనులతో ఉభయ వేదాలను అధ్యయనం చేసే బ్రాహ్మణులను ఆనందింపచేసేవాడు, మిక్కిలి అందాన్ని కలిగినవాడు అయిన

వరదరాజస్వామిని, పుణ్యం చేసినవారు పడమటి గోపుర ద్వారంలో సేవించి ఆనందిస్తున్నారు.

**"ధన్యాః పశ్యంతి మే నాథమ్"** (పుణ్యం చేసినవారు మాత్రమే నా నాథుని దర్శిస్తున్నారు) అని సీతాదేవి బాధతో పలికినట్లుగా, వీరు కూడా **"పుణ్యకృతో భజంతే"** (పుణ్యం చేసినవారు వరదరాజ స్వామిని దర్శిస్తున్నారు) అని తమ క్లేశం వ్యక్తం అయ్యేటట్లుగా పలికినందున, ఈ మహోత్సవ సేవను తాము పొందని సమయంలో కవి ఈ స్తోత్రాన్ని అనుగ్రహించారు – అని తెలుస్తున్నది.

ఈ చివరి శ్లోకంలో దొడ్డయాచార్యస్వామివారు గతంలో తాము ఎన్నోసార్లు కంచిలో సేవించిన వరదరాజస్వామి గరుడోత్సవ వైభవాన్ని స్మరిస్తున్నారు. పరమకారుణికుడు, భక్తవత్సలుడు అయిన వరదరాజస్వామి తన అర్చకులను ఆదేశించి, క్షణకాలం పాటు తనముఖాన్ని గొడుగులతో కప్పివేయమని ఆజ్ఞాపించి, ఆ సమయంలో తన సేవకోసం ఆరాటపడి, తన వద్దకు రాలేక చోళసింహపురంలోనే తన సేవకోసం వేచి ఉండే దొడ్డయాచార్యస్వామివారికి తన దర్శనాన్ని అనుగ్రహించాడు. ఆతరువాత యధాప్రకారంగా కంచిలోని భక్తులకు తన దర్శనాన్ని పడమటి గోపురద్వారంలో అనుగ్రహించాడు. గరుడసేవసమయంలో అతడు మహావేగంగా వీధులలో కదలడం చూస్తే, పూర్వం గజేంద్ర రకహణకోసం వేగంగా వెళ్ళిన సందర్భం గుర్తుకువస్తుంది. వరదరాజస్వామి ఆ సమయంలో యధోక్తకారి సన్నిధికి, అష్టభుజస్వామి సన్నిధికి మధ్యన ఆగి దేశికులకు బహుమానాన్ని అనుగ్రహిస్తాడు.